# ధర్మదీక్ష

కవి

ముదివర్తి కొండమాచార్యులు

*Publishers :*

**V. V. NAIDU & SONS**

EDUCATIONAL PUBLISHERS

TRUNK ROAD :: NELLORE

# పీఠిక

రసభరితమై, ధ్వనిగర్భితమై, ఔచిత్యసమన్వితమై, ఉదాత్తభావ సందీపితమైన రచనమే కావ్యమనఁబరగును. కఠిన జీవిత సమస్య లెదుర్కొనినపుడు యాతనచే పీడింపబడు మానసముపై పీయూషధార బోలు భావమును వెలారించి, కావ్యకర్త దానికి సాంత్వన సుఖమును చేకూర్చును. పాఠకుని చిత్తమున జ్ఞానప్రదీపమును నిలిపి, అజ్ఞానమును, అహంకారమును, అంధకారమును తొలగించు మహనీయుఁడాతడు.

"ధర్మదీక్ష" గ్రంథకర్త ఇట్టి మహనీయుడని ఈతని గ్రంథమే చెప్పక చెప్పుచున్నది. సత్యమునెఱిగిన మానవుడు భయసంశయముల నుండియు, మోహ దుఃఖములనుండియు ముక్తినందును. ఈ మహత్తర పాఠమును శ్రీ ముదివర్తి. కొండమాచార్యులుగారు తమ గ్రంథమున వ్యక్తీకరించిరి.

సుప్రసిద్ధ తీర్థంకరుడు వర్ధమానుడును, శాక్యసింహుడును, వరలినకాలమది. రమారమి రెండువేల యేనూతేండ్లకు మున్ను భారత వసుంధరలో జోడుజ్యోతులవలె తేజరిల్లి మనుష్యలోకమునుండి అజ్ఞానాంధకారమును తొలగించిన మహాత్ములువారు। జీవకారుణ్యమును, ప్రేమతత్త్వమును, అహింసాసిద్ధాంతమును బోధించిన ఆచార్యులువారు, "ధర్మచక్ర ప్రవర్తన సూత్రము"ను మనుష్యహృదయ ఫలకములందు ప్రతిష్ఠింప నిశ్చయించిన, పరివ్రాజక చక్రవర్తులువారు। కలియుగమున జనించిన త్యాగమూర్తులలో అగ్రగణ్యులు వారు।

# గ్రంథకర్త పల్కులను పరిశీలింపుడు

" అమలజ్ఞానమరీచి మాలికలచే నజ్ఞానగాఢాంధకా
రము మాయించెడు చండభానుఁడు దయార్ద్రస్ఫీతచిత్తుండు, శాం
తమనస్సద్మ్ముఁడు నిర్వికల్పహితబోధజ్ఞానపూర్ణుండు జై
నమతాచార్యుఁడు కేవలుండటె ?...................... "

" తనగాటంపుఁ గవుంగిటందవిలి నిద్రాపారవశ్యంబు బొం
దినకాంతామణి బాసి యాత్మభుజమాణిక్యాసనంబందు, నె
మ్మనమారన్ వసియింపనిచ్చ గొను సామ్రాజ్యేందిరం ద్రోసి, ని
ర్జన ఘోరాటవులందు నిశ్చలమతిన్ సాధించెఁ గైవల్యమున్."

" అలరుచుమేల్మిప్రామినుకు టందెలుమ్రోయఁగ నేతపస్వి వా
జ్నిలయమునం దమందగతి నృత్యమొనర్చునొ పల్కుబోటి; చం
చల చరితేంద్రియాశ్వములఁ జిక్కనదల్చెడు ధీరుడెవ్వఁ డ
య్యలఘుఁడు వర్ధమానుఁడు మహాత్ముఁడుగాడె తలంచిచూడఁగన్."

" మమతలఁ బాఱద్రోలితివి; మారునిమాయలగెల్చి నిత్యసౌ
ఖ్యము ఘటియించు మోక్షపదమందితి; సంసరణాంబురాశిలో
నమునుఁగు జీవరాసుల కనారత భద్రపథమ్ము జాటు నిన్
విమలచరిత్ర ! గౌతమమునీ ! అలతిన్ గొనియాడ నేర్తునే ?"

" పరమోదారగుణాకరా ! నయన నిర్వాణంబుగావించు సు
స్థిర సౌఖ్యామృతమూర్తి !.......... "

బౌద్ధమత జైనమతాచార్యులిర్వురు శిశునాగవంశభూపాలుడైన బింబిసారుడేలుకాలమున మనదేశమున విజృంభించిన దురాచారములను దూరీకృత మొనరించి తమ తపోమహిమచే పలువుర మానసములను

పునీతము లోనరించి ధర్మపతాకమును ప్రతిష్ఠించిరి. బింబిసారుని కుటుంబమున తలయెత్తిన విషమపరిస్థితినుండి కవి తన కథావస్తువును సృష్టించుకొనెను. స్థితప్రజ్ఞనెఱుగక బింబిసారుడును, అజాతశత్రువును ఉద్రేకభరితహృదయులై ముప్పుదెచ్చుకొనిరి. తండ్రివలన తల్లి కెగ్గు ఘటిల్లెనని యూహించిన తనయుడు తండ్రిని కారాగారమున బంధించెను. యాతనబడి, విషముగొని జనకుడు నేలగూలెను. పశ్చాత్తాపముచే తనూభవుడు పొగిలెను.

" రాజగృహపురి కనతిదూరంబునందు
శాంతిదేవత నాట్యంబు సలుపునట్టి
వేణువనమును భిక్షుక వితతితోడఁ
బావనమొనర్చె బుద్ధుఁడు భద్రమూర్తి. "

ఆ మహాత్మునిజేరి అతడు శాంతి భిక్ష నర్థించెను. గ్రంథకర్త ఆంగ్ల సంస్కృతాంధ్ర సాహిత్యములను చక్కఁగ పరిశీలించిన మనీషియని పాఠకు లవలీలగ గ్రహింప జాలుదురు.

" కదలి గర్భంబునఁ మాటువడిన యట్టి
మౌక్తికంబులవంటి సన్మాన్య చరితు
లెందరీ ధారుణీస్థలి యందఁగిరొ :
— చంచలంబైన జగతి శాశ్వత మెదోయి ?"

ఈ పద్యము Thomas Gray రచించిన "Elegy in a Country - Church-yard" అను సుప్రసిద్ధ రచనమందలి భావశబ్దలతను తలపునకు దెచ్చును.

గ్రంథకర్త నైసర్గిక ప్రతిభా సమన్వితుడైన భాగ్యశాలి. యువకుడై ఈతడు వ్యక్తీకరించిన భావనాశక్తి అద్భుతమై యుండుట గని పరమానందము నందుచు క్రమ వ్రతము కతన జగతియందలి మహాకవులలో నొకడు కాజాలునని ఆశపడుచున్నాను.

"జిలుగు మొగుళ్ల పందిటను జిక్కగఁ బూచిన జాదులట్లు తా
రలగమి యామినీ కచభరంబునకుఞ్ సౌబగుఞ్ ఘటించుచుఞ్
బొలుపువహించె; సత్త్వ గుణ పూర్ణ విశుద్ధ మనంబు రీతి ని
శ్చలమయి శాంతమై ప్రకృతి సమ్మదముఞ్ సమకూర్చె నెంతయున్."

గ్రంథకర్త భావనాశక్తి యెట్టిదో దృష్టాంతీకరించుటకై ఈ యొక్క
పద్యము నిందు పేర్కొంటిని.

"సమ్యక్ చారిత్రంబును
సమ్యక్ జ్ఞానంబు సరస సమ్యగ్వాక్కుల్
సమ్యక్ దర్శనమును మఱి
సమ్యక్ కరణమును గూర్చు సాయుజ్యంబుఞ్"

తథాగతుడు బోధించిన అష్టాంగ మార్గమును కవి ఈ పద్యమున కౌశల
ముతో సంక్షేపముగా నుదాహరించెను.

ఈ దృశ యుత్కృష్ట కృతులను గ్రంథకర్త పెక్కింటిని రచించి
ప్రపంచ ప్రఖ్యాతి నందునని విశ్వసించుచున్నాను. తన గురువర్యులును,
సుప్రసిద్ధ రచయితలునైన శ్రీ వరిగొండ. సత్యనాయణమూర్తి పంతులు
గారికి కవి తన కృతిని సమర్పించుట ముదావహము.

Camp
Ahmedabad
6-1-'45

జొన్నలగడ్డ. సత్యనారాయణమూర్తి

పరమ వాత్సల్యమున ఈ నా చిఱు కబ్బమునకు "పీఠిక" ననుగ్రహించిన
'సాహిత్యభూషణ'
'భారతీతీర్థ' బ్రహ్మశ్రీ జొన్నలగడ్డ. సత్యనారాయణమూర్తి
యం. ఏ., బి. యల్ గారికి వందనసహస్రములు.

గ్రంథకర్త.

# విజ్ఞప్తి



నవ్యాంధ్ర సాహిత్యవీథులు భావకవిబ్రహ్మలతోఁ గలకలలాడుచున్నవి. శ్లోదరమణీయహృదయులు పుట్టి ఆంధ్ర కవితాక్షేత్రమున కావ్య సువర్ణసస్యము ఫలింపఁ జేయుచున్నారు. ఇఁకెట్లు తెనుఁగునేల కవితాదుర్భిక్ష మొదవఁగలదు ?

నాఁటినుండి నేఁటివఱకు సర్వతోముఖముగ పరివ్యాప్తిఁగాంచిన ఆంధ్ర కావ్యజగత్తునందు బుద్ధ భగవానుని పవిత్ర ధర్మబోధామృతమున వెల్లివిరిసిన కావ్యములు చాల తక్కువగ నున్నవి. ఆ భావము మదినిడుకొని 'జాతిగుండె' లను కఱఁగింపఁజాలి ఒక పవిత్ర సందేశమును లోకమున కర్పింపఁగల ఈ చారిత్రక బౌద్ధగాథను నా కొసఁగి వ్రాయఁ బ్రేరేచిన నా గురువర్యుని పాదయుగమున నా కవితా లతిక యందుఁ బుష్పించిన ఈ ప్రథమకావ్య ప్రసూనమును భక్తి తాత్పర్యముల నిడుకొంటిని.

నా కృతికిట్టి యాకృతి నొసఁగి నన్ను మన్నించిన అనూన కవితా సామ్రాజ్య పట్టభద్రులు—యశస్విలకులు

నగు బ్రహ్మశ్రీ ఉప్పల. నరసింహ శర్మగారి కాజన్మాంతము కృతజ్ఞుఁడను.

ఈ యల్ప కావ్యములోని గుణములను 'గోరంతలు కొండంతలు'గ నెన్ని తమ విశాల ప్రసన్నహృదయములు వెలువఱచి నాపై అమోఘాశీః కుసుమముల వర్షించిన రససిద్ధులగు కవీశ్వరులకు భక్తిపూర్వకనమోవాకములు.

తల్లి చనుపాలతో నలవడిన బిడ్డల తొక్కు పలుకులు రసార్ద్రస్వాంతములను వ్రేళ్ళూరించునను ఆసచే ఈ ఖండ కావ్యము వ్రాసితిని. గుణగ్రహణపారీణులు నెరసులఁ బరిగణింపకుందురుగాత యని కేల్మోడ్చి వేడుచున్నాను.

ముదివర్తి కొండమాచార్యులు.

# గురుదక్షిణ



ఏ యమృతంపులగ్నమున నే జనియించినవాఁడనో భవత్
శ్రీయుత పాదసన్నిధి వసించుచు త్వన్మృదువాక్యసారముఁ
హాయిగఁ గ్రోలు భాగ్యఫలమందితి - శ్రీవరిగొండ సత్యనా
రాయణమూర్తి! దేశికవరా! కయికోవె నమశ్శతంబులన్.

నేనెవ్వండ, ననల్ప గద్యకవితా నిస్తుల్య సద్విశ్వ ధా
త్రీ నిర్మాణకళామహత్త్వ జిత నీరేజోద్భవుఁ, జానకీ
ప్రాణాధీశ పవిత్రనామ జప దివ్యానందసామ్రాజ్య ల
క్ష్మీ నిత్యప్రణయాబ్ధిమగ్నమతి నిఁ గీర్తింప ధీమన్మణీ!

కీర్తిశేషుని గోపాలకృష్ణయార్యు
నాత్మజనకుని ముక్తికన్యాహృదబ్జ
మధుకరస్వామి, భక్తిసంభరితమధుర
'భావలహరుల'ఁ దేల్పవే పావనాత్మ!

తెలినునుమంచుసోన తరితీపుల కమ్మని పండువెన్నెలల్
చిలుకు కటాక్షమాలికల లేనగ వింపుఘటింపఁ బూర్ణప
త్పలతనుసల్పు దీవనలు సత్యముగా ఫలియించెఁ; గానిచో
వలుగులువాఱునే జడుహృదబ్జమునం గవితామరందముల్.

## గు రు ద క్షి ణ

కవితాక్రమవసంత చూతతరు శాఖాకోకిలఁ మిమ్ము మేల్
చవులందేల్చు కవిత్వముఁ బొనరుపఁ శక్తుండ నే నౌదునే?
భవదీయామల పాదపీఠయుగసేవారక్తిమైఁ బద్య ప
ల్లవ జాలాంజలినిత్తుఁ గైకొనవె లీలాపూర్ణవాత్సల్యతన్.

ఆంధ్రాంగ్ల విద్యామహాంభః స్రవంతుల
కూలంకషప్రజ్ఞఁ గొనినవాఁడు
నిర్మలోదారసద్ధర్మ బీజములకుఁ
గేదారమగుమదిఁ గెరలువాఁడు
అవ్యయానంధ దివ్య మరందము వెలార్చు
దరహాసవదన పద్మంబువాఁడు
అతిమానుషమనీష నందియుఁ గీర్తికై
భావాన నుబలాట పడనివాఁడు

మాననీయ చరితుఁడైనట్టి గురుదేవు
పాదయుగళినిడిన నాదుకృతికి
అమృతఖండమైన యాంధ్రభూమిస్థలి
నిలువ నింత నీడ కలుగుగాక.

# ఆ శీ స్సు

యువకుఁడును, వృద్ధికాముఁడు, యోగ్యతముఁడు
సాధుశీలుఁడు కొండమాచార్యసుకవి
ఉత్తమకళాను భవ్యత నొప్పు నతఁడు
సురుచిరవివేక విజ్ఞాన శోభితుండు.

తనకు నాయందుఁ గలప్రేమఁ దనదురచన
'ధర్మదీక్ష' ను గృతియిచ్చి, ధన్యుఁజేసె;
శ్రీరఘూత్తము కరుణాతిరేకమునను
ఆయురారోగ్య లక్ష్మల నలరుగాత!

వరిగొండ. సత్యనారాయణమూర్తి

'కళాప్రపూర్ణ' శతావధాని

బ్రహ్మశ్రీ

చెళ్ళపిళ్ళ - వెంకట శాస్త్రిగారు.

ఆశీః కుశలోపరి :—

మీ పుస్తకం చాలాభాగ్గం చదివి చూచాను. అనర్గళమైన ధారకలిగి నిర్దుష్టమై హృద్యమై కింబహునా సర్వథా శ్లాఘ్యమై యున్నది—మీ రచన మీ భావ్యభివృద్ధికి ద్యోతకంగా నున్నదనుటకు సందియము లేదు. ఇదియే సూత్రప్రాయమగు నా యభిప్రాయము.

క్షీరసాగరం
బెజవాడ 3-1-46

వెం॥ శా॥ శతావధాని.

# "నవ్యాంధ్ర కవిబ్రహ్మ"

ఆ చా ర్య

బ్ర హ్మ శ్రీ

రాయప్రోలు - సుబ్బారావుగారు.

ఉస్మానియా విశ్వ విద్యాలయము.

మిత్రమా !

తొలిచూలి పెయ్యవలె, వం
కలుతీఱిన చక్కనలె నిగారించెడి నీ
తొలకరి కైతల కై సే
తల, ఫలియించెను పునాస ; ధన్యుఁడవు కవీ !

రచియింపవయ్యా మంగ
ల్యచాక్షుషీలాలసా విలక్షణ దీక్షఁ
ప్రచురముగాఁ యావన్నవ
సచేతనా చేతన ప్రసన్న మధురిమల్

లలితాకుటీరం
మారేడుపల్లి
సికింద్రాబాదు
10-1-46

భవదీయుడు
రాయప్రోలు - సుబ్బారావు.

బ్రహ్మశ్రీ

## పింగళి - లక్ష్మీకాంతంగారు, యం. ఏ.,

(Reader & Head of the Department of Telugu,
Andhra University.)

ఆర్యా !

మీ 'ధర్మదీక్ష' అందిన వెంటనే తుదిదాక చదివి తిని. మీశైలి చాల సరళ సుందరముగా నున్నది. బౌద్ధ గాథ యగుటయు, సౌందరనందము పలుకుబడి ప్రతిబింబించు రచన యగుటయు కారణములుగా నాకీ కావ్యము, ఎక్కు మక్కువ గొల్పెను.

ఉత్తరత్ర, మీరింతకంటె ఎక్కువ పెద్ద పుస్తకములు వ్రాయగలరు. వ్రాయగల శక్తిని పరమేశ్వరుఁడు మీకు ప్రసాదించుగాక.

గుంటూరు
22-12-45

పిం॥ లక్ష్మీకాంతం.

బ్రహ్మశ్రీ

# వేటూరి. ప్రభాకరశాస్త్రిగారు

ఆర్య! వందనములు.

మీ లేఖమును బట్టి మీరు చాలఁ బసిప్రాయపు వారని తెలిసినది. కాని 'ధర్మదీక్ష' యను మీ రచనమును బట్టి చూడఁగాఁ బరిణత ప్రజ్ఞుఁడైన ప్రౌఢకవికిఁ బైచేయిగా మీరు కానవచ్చుచున్నారు. వస్తువు అద్భుతరసపు సుడిగుండములు గల కరుణరస వాహిని! ఇటువంటి దివ్య కథావస్తువులను [మతవైముఖ్యముచే] నుజ్జగించి శృంగార ప్రచురములైన పురాణ కథావస్తువులకే మనపూర్వులు ముచ్చటపడిరి గదా!

మీబోటి బుద్ధిమంతులు దయాధర్మ ప్రచురములైన కథల నిట్టివానిని గావ్య వస్తువులుగాఁ గొని సరస రచనా సామర్థ్యమును సఫల పఱచుకొందురు గాక!

మీ కవిత మంచిశయ్య, పాకము, భావపరిపాకము కలదై ఆనందము గొల్పుచున్నది. అపూర్వ కావ్యభూషలచే నాంధ్రసరస్వతి నలంకరించుచు నాయుష్మంతులై కీర్తివంతులై మీరు వెలయుదురు గాక!

తిరుపతి
మకర సంక్రాంతి

వేటూరి. ప్రభాకర శాస్త్రి

# 'అభినవతిక్కన', 'సాహిత్య స్థాపక'

బ్రహ్మశ్రీ

దుర్భా. సుబ్రహ్మణ్య శర్మగారు

(Retired Lecturer in Telugu, V. R. College)

చిరంజీవి ముదివర్తి. కొండమాచార్యులకు—

దుర్భా. సుబ్రహ్మణ్యశర్మ—అనేక వేదోక్తాశీర్వాదములు—

మీ కవితాధార అనర్గళముగాను, శైలి ప్రసన్నముగాను, రచన రసవంతముగాను నున్నవి. కథలోనే కరుణ రేకొల్పు నంశములు అనల్పముగా నున్నను, మీరు దానిం దిద్ది తీర్చిన తెఱఁగు హృద్యముగా నున్నది. ఇంత చిన్న వయస్సునకే ప్రజ్ఞ యిట్లు పరిణతమగుట పురాకృత సుకృత పరిపాకము. భగవంతుఁడు మీకు దీర్ఘాయు వొసఁగి, ఇంత కన్నఁ బెద్దకృతులు వ్రాయుటకు వలయు బుద్ధిపాటవమును, దీక్షయు లభింపఁ జేయుఁగాతమని యాశంసించుచున్నాను.

చ॥ ఇరువది వత్సరంబులకె యింత ప్రసన్నముగా, మృదూక్తి సుం
దరముగ, 'వీర' 'శాంత' 'కరుణల్' గలగాథను దిద్ది
పరిణతి పూర్వపుణ్య పరిపాకముగా గణియింతు జుమ్ము ; ధీ
వర ! చిర మాంధ్రికిల్లె వరివస్య మొనర్చి యశమ్ము గాంచుమా.

క॥ 'అభినవ కవితాచార్యుఁడు'
'ప్రభాకరుఁడు' కింకవీభపంచాననుఁడు'న్
శుభమతి 'లక్ష్మీకాంతము'
నభినందించిరి నినుఁ గృతార్థుఁడవు కవీ।

నెల్లూరు
11-2-46

ఇట్లు
దుర్భా. సుబ్రహ్మణ్య శర్మ

శ్రీమదిత్యాది శ్రీయుతులు

# రాళ్ళపల్లి. అనంతకృష్ణ శర్మగారు

ఆంధ్రోపాధ్యాయులు

మహారాజా కాలేజి

ఆర్య!

తమ 'ధర్మదీక్ష' సాంతముగా చదివితిని. తామే వ్రాయకుండినచో ఇది తమకు 'ప్రథమ ప్రయత్న' మను భావము నాకు కలిగియుండదు. భాష, భావములు, రచన— అన్నియు మంచి పక్వతను చాటుచున్నవి. ప్రథమ ప్రయత్న మింత సఫలముగా సర్వాంగ సుందరముగా పరిణమించుట సృష్టిలో అసాధారణము. చాల సంతసించితిని. ప్రతి పద్యము సంస్కృతాంధ్రములలో తమకుఁ గల ధారాళమైన చొరవను, భావముల చిక్కఁదనమును, అంతకన్న నెక్కువగా చిత్తసంయమమును వెలువఱుచుచున్నది. తెలుఁగు

తల్లి మీవలన ఇంకను పలువిధముల ఉత్తరోత్తరముగా ఉత్కృష్ట కైంకర్యములు లభించునని యెదురు చూచుచున్నది.

ఎక్కువ వ్రాయలేను.

1135 కృష్ణమూర్తిపురం
మైసూరు
6-2-'46

ఇట్లు
భవదీయుఁడు
రా. అనంతకృష్ణ శర్మ

## 'కథక చక్రవర్తి'

బ్రహ్మశ్రీ

చింతా - దీక్షితులుగారు.

ప్రధానోపాధ్యాయులు

ప్రభుత్వ బోధనాభ్యసన పాఠశాల.

చి॥ ము. కొండమాచార్యులకు—దీక్షితులు ఆశీర్వచనములు—

నీవు వ్రాసిన ఉత్తరమూ పంపిన "ధర్మదీక్ష" అనే కావ్యమూ అందినవి.

"ధర్మదీక్ష" చదివితిని. అందలి కథ చక్కగా ~~ఉన్న~~ది. కథ సాగించడంకూడా చక్కగానే జరిగినది. పద్యములు కుంటుపడకుండా ధారాళముగా నడుచుచున్నవి. భాష మృదువుగా ఉన్నది. తొలికృతి ఇంతచక్కగా నిర్వహించకలిగినందుకు నిన్ను అభినందిస్తున్నాను.

కనిగిరి
22-2-46

చింతా - దీక్షితులు.

బ్రహ్మశ్రీ

# విద్వాన్. మేడవరం రామచంద్రశాస్త్రిగారు

ఆంధ్ర ప్రధానోపాధ్యాయులు

మిషన్ హైస్కూలు.

మిత్రరత్నమా !

ఉ॥ నెమ్మదికెన్ని చందముల నీటుగదిద్దిన ముద్దు బల్కులన్
సమ్మదమావహిల్ల నిటు చక్కని జాడల సాగిపోవఁగా
సుమ్ము కవీంద్రసూరిజన సూక్తుల సన్నుతికెక్కె నీపయిన్
ముమ్మరమైన ప్రౌఢగతి మోదము గూర్చుతమాకు నిత్యమున్.

తిరుపతి
10-3-46 } మేడవరం - రామచంద్ర శాస్త్రి.

## 'ఆంధ్ర వైయాకరణ కేసరి'

"ఉభయభాషాప్రవీణ"

బ్రహ్మశ్రీ

చేబోలు - సుబ్రహ్మణ్య శర్మగారు.

పలుకుఁ దనమ్ముసుందరము భావసుమంబుల సొంపు హృద్యమా
ఖ్యల పరువుందనమ్ము కవికర్ణరసాయన మార్య ధర్మముల్
సలలిత మార్గదర్శక రసస్ఫురణమ్ములు కొండమార్య ! నీ
కులుకుల "ధర్మదీక్ష" పలుకుం జెలిఁ దేటగఁ బాడఁజూచినన్.

తిరుపతి
10-3-46 } చేబోలు - సుబ్రహ్మణ్య శర్మ.

# ప్ర బో ధ ము

"బలవన్మోహ మహాంధకారమున నిర్వాణాధ్వముం దప్పి సం
చలితోత్తుంగవిషాదభంగభరసంసారాంబుధిం దోఁగి యా
కులతన్ దిక్కులు పిక్కటిల్ల భృశమాక్రోశించు జీవాత్ములా
ర! లసత్తత్త్వ సుధారసంబు నిజకర్ణప్రీతిమైఁ గ్రోలుఁడీ!

సకలప్రాణిచయంబు లీశ్వరుని సత్సంతానమై యుండ హం
తకు లాత్మాభ్యుదయార్థమిచ్చు పశురక్తం బాతఁడాశించునే?
అకటా! బిడ్డల నాహుతింగొనఁగ నెట్లంగీకరించున్ దురా
త్మకుఁడైనం జనకుండిదే పరమసత్యంబేల చింతింపరో!

కటికియెడందతోఁ గఱకుఁగత్తుల గొంతులుగోయు పాపులన్
గటకట! జంతువుల్ నరులుగాఁ గలనైనఁ దలంప వెందు న
క్కటికముఁ జూపనౌఁ; బసులఁగాఱియవెట్టు కిరాతులార! యిం
తటివగు దారుణక్రియల దైవమెటుల్ సహియింప నోపెడిన్?

# ధ ర్మ దీ క్ష

వృంతము వీడి నేలఁబడి వ్రేల్మిడి వాఁడి నశించు పూవు లా
గెంతయు నశ్వరంబయిన హేయఁపుఁగాయమునందు మోహసం
క్రాంతమతిన్ యథార్థమును గానరు మూఢులు ; కాలరీతులే
వింతలు - జీవులార ! తఱివీడినఁ జేసెడిదేమి చూడుఁడీ !

కనుఁగవ సమ్మదాశ్రువులు గ్రమ్మఁగ వత్సలతా విముగ్ధయై
తనయునిఁ జేరఁ జీరి యొడిఁ దార్చెడు తల్లినిఁ గొలుపుచ్చి పు
త్రునిఁ దనపొట్టఁ బెట్టుకొను క్రూరపు మృత్యువు ప్రాణిదుఃఖముల్
గని కటుణించునే ? జనుల కాంక్షలు దీరఁగ వేచియుండునే ?

ఒకఁడు రుజార్తిచేత మృతినొందెడు ; దుష్టభుజంగదష్టుఁడై
యొకఁడు నశించు ; రూపఱెడునొక్కఁడు దావమహాగ్నియందు ; నిం
కొకఁడు జలంబులఁగెడయు ; ఓ జనులార ! వినుండు—మృత్యువ -
క్త్రకుహరమందడంగకయ తప్పునె ? యెన్నివిధాల జీవికిన్

పట్టు పాన్పుల సుఖముగాఁ బవ్వళించు
మనుజవిభునకు - కటికినేలను బరుండు
పేదకును — అయ్యలార ! జీవితమునందు
నంతరంబున్నది — సమాధియందు లేదు.

# ప్ర బో ధ ము

ధనముల్ పుత్ర కళత్ర మిత్రములు నిత్యంబుల్ సుఖాపాదులౌ
నను విశ్వాసపుటాస వేసర కహింసాస్తేయశౌచాది పా
వనధర్మంబుల త్రోవనంటి సుఖియింపన్ రారె! దుర్వార దుః
ఖ నివేశాబ్ధి నిమగ్నులార! భవరోగవ్రాతముల్ దూలఁగన్

" సమ్యక్ చారిత్రంబును
సమ్యక్ జ్ఞానంబు సరససమ్యగ్వాక్కుల్
సమ్యక్ దర్శనమును మఱి
సమ్యక్ కరణమును గూర్చు సాయుజ్యంబున్."

అని యీలాగున వర్ధమానుఁడురుదుఃఖాంభోధి నిర్మగ్న మ
ర్త్యనికాయంబు మహార్తిఁ బాపి దరిఁజేర్పన్ సత్యవాగర్థగుం
భనపీయూషము వెల్లిఁ గొల్పె; మగధప్రాజ్యావనీ ముఖ్య ప
త్తనమౌ రాజగృహాభిధానపురి రథ్యామధ్య భాగంబునన్

ఉడుగక వీచు చండపవనోద్ధతి వెగ్గెడు రత్నదీపమున్
వడువున నా 'జినుండు' భువనంబులు బెగ్గడిలంగముంచి పె
న్గడవలఁ గ్రుమ్మరించెడు ననందగు భీకర వర్షధారలన్
జిడిముడి పాటొకింతయును జెందఁడు తన్మహిమం బదెట్టిదో?

# ధర్మ దీక్ష

వనజవిలోచనాప్రణయ వాగమృతంబును గ్రోలి సోలుచున్
మనసిజు మాయలం దవిలి మార్గముఁ గాననిరాజులేడ ? పా
వనతరతత్త్వబోధ శ్రుతిపర్వముగా వినులేడ ? ఔర ! యా
జినముని 'బింబిసార' నృపుఁ జిత్రఁపుబొమ్మగ సల్పినిల్పెఁడే !

జీవకారుణ్య మూర్తి వచించునట్టి
యమృత మధురార్ద్ర సత్యవాగర్థ వితతిఁ
బారవశ్యముఁ జెందు నృపాలుపత్ని
'కోసలాదేవి' నవనీత కోమలాత్మ.

భవరోగార్తిహరౌషధంబయిన తద్వాక్యామృతస్ఫీతి మే
ల్జవు లూరించుచు వీను విందు లొనరించం జొక్కి పంచేంద్రియ
వ్యవహారంబుల విస్మరించిన మనుష్యవ్రాతముల్ కుడ్య చి
త్ర వితానమ్ముల పోల్కినుండిరటఁ జైతన్యావశిష్టాత్ములై

కాఱు చీఁకట్లు పొడముచుఁ గడలఁ గ్రమ్మ
నమ్మహా సత్య సంకల్పు నాజ్ఞవడసి
యాత్మసతితోడ భద్రగజాధి రూఢుఁ
డైన భూజాని యటనుండి యరుగునపుడు.

# ప్ర బో ధ ము

కూరిమి పల్లవింపఁ దనకున్ మదిమేలుఁ దలంచు కోసలా
నీరజనేత్ర తోడ దయ నెక్కొనఁ బల్కె : "అనుంగు నెచ్చెలీ!
సారసుధారసార్ద్ర ముని చంద్ర వచస్సులు ముక్తికాంతమం
జీర నినాదముల్ గదవె! శిష్ట జనాభి మతంబుఁ గూర్పవే?

అమలజ్ఞా నమరీచి మాలికలచే నజ్ఞాన గాఢాంధ కా
రము మాయించెడు చండభానుఁడు - దయార్ద్ర స్ఫీతచిత్తుండు - శాం
త మనస్సద్ముఁడు, నిర్వికల్ప హితబోధజ్ఞాన పూర్ణుండు, జై
న మతా చార్యుఁడు, కేవలుండ టె? దళన్నాళీకపత్రేక్షణా!

తనగాటంపుఁ గవుంగిటం దవిలి నిద్రాపారవశ్యంబుఁ బొం
దిన కాంతామణిఁ బాసి యాత్మభుజ మాణిక్యాసనంబందు, నె
మ్మనమ్మారన్ వసియింప నిచ్చుఁ గొను సామ్రాజ్యేందిరం ద్రోసి — ని
ర్జన ఘోరాటవులందు నిశ్చలమతిన్ సాధించెఁ గైవల్యమున్

అలరుచు మేల్మి ప్రామినుకుటందెలు మ్రోయఁగ నేతపస్వి వా
ఙ్నిలయము నందమందగతి నృత్యమొనర్చు నో పల్కుబోటి; చం
చల చరితేంద్రి యాశ్వములఁ జక్కనదల్చెడు ధీరుఁడెవ్వఁ డ
య్యలఘుఁడు వర్ధమానుఁడు మహాత్ముఁడు గాడె తలంచిచూడఁగన్"

## ధర్మదీక్ష

అనియిటులా నృపాలకుఁ డనన్యతపః పరిపక్వచిత్తుఁడౌ
జినముని పూత జీవిత విశేషములెన్నుచు రాణితోడు తం
జనియె ; తదీయ పూర్వభవసంచిత పుణ్యవిశేషమేమొకో !
వినుతగుణాఢ్య కోసలయు విస్మృతిఁ జెందదు వర్ధమానునిఁ

# సంశయము

మనమున లయించు విషయంబు మఱపురాక
నాఁడు నాటికి దృఢముగ నాటుకొనును;
మనముఁ జొఱనట్టి విషయంబు మంచిదయ్యుఁ
గాలగర్భంబు లోపలఁ గలసిపోవు.

ప్రాలేయాచల నిర్గతామరనదీ స్వచ్ఛాంబులోలోర్మికా
జాలోద్భూతమరుత్కిశోరములు కాంక్షల్ మోసులెత్తింపఁగా
లీలాసౌధమునందుఁ దల్పమును హాళిం జేరుకొన్నారు భూ
పాలోత్తంసుఁడుఁ గోసలాసతియు నిర్వ్యాజానురాగంబునన్.

జిలుగుమొగుళ్ళ పందిటను జిక్కఁగఁ బూచిన జాదులట్లు తా
రలగమి యామినీ కచభరంబునకున్ సొబగున్ ఘటించుచున్
బొలుపువహించె; సత్త్వగుణపూర్ణ విశుద్ధమనంబురీతి ని
శ్చలమయి శాంతమై ప్రకృతి సమ్మదమున్ సమకూర్చెనెంతయున్.

ప్రాణపతి పజ్జ సెజ్జపైఁ బవ్వళించి
నిదురఁజెందిన కోసలా నీరజాక్షి
అక్కటా! యీ విభావరి నాతఁడెటులఁ
గడపఁగలఁడంచు నదరునఁ గలవరించె—

# ధ ర్మ దీ క్ష

పొరపొచ్చెంబులు లేని ప్రేమరస సంపూర్ణప్రసన్నాత్మ, ని
ద్దురలో నట్టులఁ గల్వరించుటయు తద్భూకాంతుఁడాలోచనా
పరుఁడై మేల్కొనియుండుటన్ విని సహింపం జాలకత్యంత రౌ
ద్రరసావేశముతోడ మానసము దుర్మార్గంబునం బారఁగన్

ఎగిరిపడు త్రాచుకరణిన్
భగభగమనిమండు దావవహ్ని తెఱఁగునన్
మిగులుచును నొడుగఱచుచుఁ
బొగులుచుఁగులకాంతఁగూర్చి బుద్ధిఁదలంచున్

"నన్నునిలువేల్పుఁబలె మదినమ్మి కొలుచు
సరస సౌహార్ద్రవతి యీమె సత్యమేని
'అక్కటా! యీ విభావరి నాతఁడెటులఁ
గడపఁగలఁ డం' చు నిదియేల కలవరించు?

ననుమన్నించెడు కూర్మినెచ్చెలుల లోనం బెద్దగాఁజూతు ని
న్ననుగుం దొయ్యలి! త్వద్దయా మధుర భిక్షాకాంక్షియౌ సార్వభౌ
ముని యిల్లాలివి—పాపశంకమదిలోఁ బొఁద్రోచి యీరీతిగా
ననురాగోజ్జ్వల వల్లరిం దునుమ కట్టా! చిత్తమె ట్లొప్పెనో!

# స ం శ య ము

ప్రవిమలమైన ధర్మమును భావమునందుఁ దలంపఁబోక పు
త్రవతికి నీకు ఘోరతర దారుణకృత్య మొనర్పనెట్లు బు
ద్ధివొడమె? నిన్ను నమ్మిచెడితిన్ గులకాంతవటంచు నెంచి; యి
ట్టివగునె? మానినీ ప్రణయటీకలు—పుణ్యసతీప్రవర్తనల్

దవశిఖికీలికావితతి దారువు రూపటినట్లు నాదు గౌ
రవము నశించె నీకతన రాక్షసి! నా హృదయంపు శూలమౌ
దువనితలంపనై తిఁగదె? దుష్టమతుల్ వసియింపఁజోటు లే
ద విరళపుణ్యభారతమహావని శీతలగర్భ సీమలోన్

ఈ శిశునాగవంశభవు నిద్ధయశః పరిపూర్ణచంద్రికా
రాశిని దుర్యశోంబుద పరంపరలెల్లెడఁగప్పె; సాటిభూ
మీశులలోననెట్లు తలయెత్తుకొనంగలవాఁడ? ఓసి! దు
ష్టాశయురాల! నీ కిహమునందు శతాయువునిండె నేటితోన్

దురితమతీ! కరాసి నినుద్రుంతునిదే" యని బింబిసారుఁడ
ప్పరమపురంధ్రిఁ జంపఁగఁ గృపాణమునెత్తియుఁ జేతులాడమిన్
గరకరిడించి మైవడఁకఁగా మది వెన్నవలెన్ గఱంగఁగా
మరిమరిగా విచారములు మానఁపుఁబెంపునఁ దీవరింపఁగన్

# ధ ర్మ దీ క్ష

అరినరపాలకంఠ దళనాతిభయంకర ఖడ్గధార, ని
ష్కారుణత నిట్టులీ యబలఁజంపఁదలంచుటనాకుఁ బాడియే
పరమ కిరాతుఁ డీ ధరణిపాలకుఁ డంచును లోకులెల్ల దూ
రరె నను వేయినోళుల కరంబును గ్రోధపరీతచిత్తులై.

మనుజవితానముల్ వెడఁగు మాటల నాడిననాడుఁగాక, యి
ప్పని నొనరించుటన్ గడకుఁ బ్రాణములేగిన నేగుఁగాక, దీ
నిని గులపాంసనిన్ బరమనింద్య చరిత్రను రూపుమాపకే
మనమునఁ గ్రోధతాపమును మాన్పఁగవచ్చునె ? నిద్రవచ్చునే ?

నామాటల్ జవదాఁటఁగా వెఱచు స్వప్నంబందునన్ నిర్మల
ప్రేమస్వాంతముతోడఁ దండ్రిననుఁబేర్మింగొల్చు 'నందాసతీ'
శ్రీమద్గర్భ పయోధిచంద్రు 'అభయున్' శ్రేయోధికుంబుత్తునీ
భూమీనాథు నకీర్తికేతువును నిర్మూలింప నొక్కమ్మడిన్.

సహజ సుకృత సస్యసంచయకేదార
లక్ష్మమతల్లి సల్లలితహృదయ
పరమపాతివ్రత్య భాసుర మానినీ
తతివతంసంబు చిత్సంప్రబుద్ధ

## సంశయము

విమలకారుణ్య దుగ్ధమునవిశ్వముఁ దేల్చు
నమరధేనువు విశుద్ధాభిజాత్య
పరిహాసమునకు దబ్బర లాడియెఱుఁగని
సత్యదేవత మహాసాధుచరిత

అనల కల్పిత విగ్రహ మా మెయందుఁ
గలదె యొకదోషమైన — నిష్కరుణతోడఁ
జంపఁ దలఁచుటఁ బాడియే జనవిభునకు ;
కాల కర్మంబులను దాఁటఁగా వశంబె !

# పరిణామము

"అప్రమత్తుఁడవై దీని నాచరింపు
మభయ ! సౌమ్య"ని యాతనినటులననిచి
బింబిసారుఁడు వేటనెపంబువెట్టి
పురము వెలువడి కొంత దవ్వరిగి నిలిచి

"అసతిగా నెంచి కోసల యసువులెడప
నంతిపురము దహింపఁగా ననిచినాఁడ
ఆకలవరింతకును హేతువరయనైతి
నదినిజంబుగ నిర్దోషురాలో ? యేమొ ?

అరమరలేల వేణువనమందు వసించుచునున్న సద్గుణో
త్తరుఁడు త్రికాలవేది ఋజుతాహితచిత్తుఁడు వర్ధమానుఁడే
తిరముగ దీని శీలమును దెల్పెడు"నంచని బింబిసార భూ
వరుఁ డటకేగి నిల్వ భగవానుఁడు మెత్తని కిన్క దోపఁగన్

"ఇంత యదీర్ఘదర్శివయితేటికి రాజ ! సతీమతల్లిపైఁ
బంత మెలర్పవెక్కసపు భావనసేసి తదీయ జీవ యా
త్రాంతక పాపకృత్యమున కక్కట ! నీ మనసెట్లు లొప్పెనో
అంతటి మానినీతిలక మారయ ధారుణియందుఁ గల్గునే ?

## ప రి ణా మ ము

పరమ పురంధ్రియొక్కనిశి వర్షమునం బరోపకార త
త్పరుఁడొకఁడొందు కష్టమును దాఁగనులారఁగఁగాంచి యుంటిని
ద్దురనటుఁ గల్వరించినది — దోషములంటునె యమ్మహాసతిన్
దెరువుము కన్గవన్ నిజము తెల్లమగున్ మదినీకు భూవరా!

పరమపరోపకారగుణభవ్య, సతీజనసేవ్య, తావక
స్థిరతర కీర్తిమూల, జగతీనుతశీల యికెట్లు దక్కునో
నరవర! పొమ్ము పొమ్మ"న మనంబున మల్లడిఁగొన్నభీతితోఁ
బిరి గొని గాఢవేదనయు వేయువిధాలఁగలంచికుంచఁగన్

ఘన విజ్ఞాన నిధానమైనముని హృత్కంజంబున న్నిల్పి భ
క్తినజస్రంబు భజించుటన్ మునుపురాత్రిన్ వర్షమందున్న యా
తని కష్టస్థితినెల్ల విస్మృతిని జెందన్ రాని నారాణి బ
ల్కెనటుల్ స్వప్నముఁగాంచి; దానిఁదెలియన్ లేనైతివిభ్రాంతుఁడన్

ఇఁకనెక్కడి కోసల నా
కిఁక నెక్కడి జీవితాశ యీ దురితం బూ
రక విడుచునే కృతఘ్నుని
అకటా! యిహపర విదూర హంతకునన్నున్"

# ధర్మదీక్ష

శ్రావణ పయోద వర్షధారలవిధాన
నక్షియుగమున దుఃఖ బాష్పాంబులురల
నాశసడలఁగ మది 'హా! హతోస్మి' యనుచు
సాఁగి పోఁవగ కాలాడ కాగలేక

"ఏమాయెనో నాప్రేయసి
భీమాగ్నిచ్ఛటల" ననుచు బిట్టడలుచు నా
భూమిపతి కోసలావని
తా మందిరమున్నవీథి దాయఁ జనుటయుఁ—

కలుషపు మృత్యుజిహ్వికల కై వడిఁబేర్చి కృపీటజన్మ కీ
లలు విలయోగ్రతాండవ విలాసముఁ దోప, దహించుచుండెఁ గో
సల నివసించు నాలలితసౌధము; దైన్యముఁ దత్తరంబు దొ
ట్రిల జనులెల్లఁ బక్కిగమి రీతిని గుయ్యిడసాఁగిరార్తిమై.

గగనమంటు తత్సౌధముఁగాల్చుచున్న
జ్వలన మార్పంగ నేరికి సాధ్యమగును?
కాంచుచుండఁగ నిల్వునఁ గాలిపోయి
కూలిపోయెను రాణి వజ్రాలమేడ

# ప రి ణా మ ము

కనుఁగవవిస్ఫులింగములు గ్రక్కుచు నయ్యెడ రోషభీషణా
ననుఁడయి దండతాడిత ఫణాధరఫూత్కృతిఁ బోలు నూర్పునన్
బొనరుచ 'జాతశత్రుఁడు' రిపుస్తనయిత్నుమహానిలుండు-చ
య్యనఁ జనుదెంచి పల్కెఁ జతురంగ బలధ్వనులేపుమీరఁగన్-

"ఏడీ ! అయ్యభయాధమాధముఁడు మాతృద్రోహి దుష్టాత్ముఁడే
జాడం బోయినఁ ద్రుంతు వానితల నస్మత్క్రూరధారాసి; నె
వ్వాఁడడ్డంబగు నాకటంచుఁ బ్రళయాబ్దవ్రాత నిర్ఘోషముల్
కూడం బారిన రీతి దిక్కుహరముల్ ఘూర్ణిల్ల గర్జించుచున్

సపత్నియని సందతో వాదుసలుపఁ బోదు
సవతికొడుకని తన్నొక చాయఁ గనదు
వాని నావలెఁ జూచు సంభావ్యచరిత్రఁ
జంపనూల్కొన్న యాపాప చరితుఁడెచట ?

ఇమ్మహానల కీలల కింధనంబు
కరణిగాకుండ నెట్టులోఁ గన్నతల్లి
ప్రాణములతోడఁ బయటను బడియెఁగాక
లేనిచోఁజూతుమే భువి మానవతిని"

# ధర్మ దీక్ష

ఆపలుకు లాత్మ కర్ణము లందుఁబడిన
నెటకొ పోయిన ప్రాణంబు లెగసిరాగఁ
బ్రబలవిధివంచితుఁడు నరపాలకుండు
నోటఁ దడియాఱ మఱి తొట్రుపాటుఁగదుర.

"అలుగంబోకుము ద్రోహియంచభయుపై నావంత ; ఆ నిత్యని
ర్మల ధర్మాత్మకు నిట్టిపాటి యపకారంబేన కావించి కే
వల మిప్పట్టున నిగ్రహార్హుఁడయితిన్—ప్రస్ఫీతకోపాగ్ని కీ
లల నన్ భస్మముసేయుమా తడవికేలా ? యేలశంకింపఁగన్.

నాకిఁకఁదావులేదు భువనంబునఁ ; బాపములెల్లఁబండె—నీ
దౌ కరవాల ధారకెఱనయ్యెద రమ్మ"ని పల్కనుల్కి "బౌ
రా ! కడకీవె పాల్పడితివా మనుజాధమ ! యిట్టిచెయ్దికిన్
గాకవహించినిన్నుఁ గడికండలుజేసినఁ బాపమున్నదే ?

ఇలువేల్పుంబలెఁ బూజసేయుచును నిన్నేనమ్ముకొన్నట్టి ని
ర్మలధర్మైక నిధాన మజ్జనని నిర్దాక్షిణ్య చిత్తంబునన్
జలమారం బొలియింపఁ బూనుటకునాసాధ్వీశిరోరత్నమే
కలుషంబుంబొనరించెఁబల్కు మిచటన్ గష్టాత్మ ! సత్యంబుగన్.

## ప రి ణా మ ము

కనివినియుఁ సహింతు వెలకాంతల నంతిపురంబులోనికిం
గొని చనుదెంచి ప్రౌద్ధసుఖగోష్ఠిని బుచ్చుట; లార్షధర్మ పా
లనమున కీవనర్హుఁడవు; లజ్జయొకింతయులేక యెట్టు లీ
జనతతిమ్రోలనిల్చుటకు సమ్మతిసేసితివీవు ? దుర్మతీ !

నీ వొనర్చిన పాపంబు నీవకట్టి
కుడువకయ తీరునే యిదెక్రూరచిత్త !
అన్నపానీయములులేక యటమటించి
కూలిపొమ్మిట్టులే చెఱసాలలోన.

జనకుఁడౌ ! ధారుణీవలయశాసనకర్తయు ! యెవ్వఁడైన, ని
మ్మనుజనిశాచరుండిపుడు మన్నన కర్హుఁడు గాడు నిర్దయుఁ
దనవెఱ్ఱికింక కెందఱు వృధాబలివెట్టెనో ? దైవమే యెఱుం
గు నితని పాప మీతఁడెఱుఁగుఁ జెఱఁగుంది నశించునప్పుడున్.

ప్రావృడంభోద ఘూరిగర్జా విభంబు
లైన యాపల్కులను విని యవని విభుఁడు
బెదరి నిశ్చేష్టుఁడై రాజవీధి భటులు
తన్నుఁ జెఱనుంపఁ గొంపోవు తరుణమందు.

# ధర్మదీక్ష

చల్లనితల్లి కోసల బుగ్గి పాల్సేయఁ
జనునె యాగడుసరి కనెడువారు
మనసొగ్గి తానొనర్చిన దుష్కృతికి శాస్తి
అనుభవింపక తీర దనెడువారు
దుర్నీతిపరుఁడైన దొరయేలుబడిలోన
హాయి యెవ్వరి కుండు ననెడువారు
రాజ్యమదంబు నిర్మల ధర్మశీలమె
ల్లను మంటగలుపునో యనెడువారు

పాపియైనను జనకుని భంగపఱుప
ననుచితము యువరాజున కనెడువారు
నైన జనులు వే భంగుల నాడు కొనుచు
నాత్మమందిరములకేగి రల్లనల్ల—

# నిరాకరణము



జనపతి బింబిసారుఁ జెఱసాలఁ దనూభవుఁడుంచు టెల్ల, తా
విని పతిదేవు దుస్థితికిఁ బెక్కువిధంబులఁ బొక్కు రాజినిం
గని కడువెచ్చ నూర్పు చుడిగంపుఁ జెలుల్ దయజాలువాఱ, సాం
త్వన వచనంబులాడ గుణవత్సల కోసలపల్కె నీగతిన్.

ప్రాక్తన జన్మదుర్భరఘోర కిల్బిష
ఫలితంబుగాకున్నఁ జెలియలార!
నా ప్రాణబంధువు నా పెన్నిధానంబు
దయమాలి యిటు సేయఁ దలఁచువాఁడె
ఈ మంద భాగ్యయం దే దోషమొదవెనో
యేరీతి నాకది యెఱుకపడును?
తన యడుగులపజ్జఁ దలదాఁచుకొను సాధ్వి
భరియించునే యిట్టి భంగపాటు

వ్రయ్యలై పోవదేల నాపాడుమనసు.
ఱాఁతఁజేసిన దేమొకో! యీ తెఱఁగున
నవధిలేనట్టి దుఃఖమహార్ణవంబు
నెట్లు తరియింతు జీవము లెట్లుఁదాల్తు?

# ధర్మదీక్ష

అతులదయాతరంగిత హృదంతర రాగరసాబ్ధిఁదేల్చు నా
పతి కిటు వెక్కసంబయి ప్రపంచమునన్ గొఱమాలిసట్టి యీ
బ్రతుకిఁకనేల నాకు క్షణభంగురమైన శరీరయాత్రకై
పతులగు వారు పోఁ దగిన జాడల విస్మృతి నెట్లుఁగాంచెదన్.

కరుణా పూర్ణ మదాత్మవల్లభ కటాక్షశ్రీ శరజ్జ్యోత్స్నలోఁ
చిరమానంద మహోన్నతాద్రి శిఖరప్రాంతంబులన్ నేను వ
త్సరముల్ బుత్తుఁగదే! దినంబులటులన్; తద్దివ్యపాదాబ్జముల్
కరవుం దీరఁగఁ గన్నులంగనక కాలంబెట్లుఁ జెల్లించెదన్ ?

పుణ్యకాంతకు వల్లభుఁ బోలునట్టి
ఆప్త బాంధవులెవ్వరీ యవని యందు
జీవితమున కాధారమౌ చెలువుఁబాసి
యెట్టులూఱట నెందుదు నిందుఁబ్రతికి.

జనపతి, కన్నతండ్రి యొకసన్నపుఁ దప్పొనరింపఁగల్గినం
తనె చెఱఁబెట్టు నిట్టి కరుణా విముఖాత్మునకేను దల్లినై
మనవలసెం గదా యనుచు మ్రగ్గుదు; జీవము వాసియుం గృతాం
తునిజగమందునన్ నిరయతోయధి మున్గెడు దాననయ్యెదన్.

# నిరాకరణము

కడుపుసెడంగ భూ భువనకంటకుఁడైన నికృష్టుఁ బుత్రుఁగాఁ
బడసెడు తల్లికంటె సతి భారము వేఱె ధరిత్రికున్నదే ?
గడగడకంపిలం దొడఁగు కాయమునింక భరింపఁజాల ని
ప్పుడమి వసించి పాపమునఁ బోవఁగఁజాల కుపుత్రమాతనై

'కొడుకుచేనిట్టి వెతలొనఁగూర్చి నాకుఁ
బగను సాధించుచున్న దీ పాప చిత్త'
యని యనుపదంబు నన్ను నోనాడు కానెడు
పతియెదుట నెట్లు తలయెత్తి బ్రతుకుదాన ?

నన్నొక రాక్షసింబలె మనంబున నెంచుచు దుర్భర వ్యథా
ఖిన్నతఁగంట నీరిడుచుఁ గిల్బిషరూపుఁ దనూజుఁగాంచుచున్
వెన్నవలెన్ గఱంగి నిజు పేదఱికంబున నుండుగుండెతోఁ
గన్నులఁగట్టుప్రాణపతి కష్టదశం గనుదాన నైతినే ?

పావనమైన నావిభుని పాదయుగంబు భజించుటల్ వినా
భావమునం దలంప నొక పాపమునైన నిజంబు దైవమా !
జీవితనాథు పాదయుగసేవకు దూరము సేసివైచి వ
న్నీ విధి నేడిపించి మఱియేమి ఫలంబు గడింతువక్కటా !

# ధర్మదీక్ష

నను నిర్భాగ్యచరిత్రఁ బుత్రవతినన్నా! నిర్దయాధీన బు
ద్ధిని గారింతువిదేల? యార్తులను బ్రీతింబ్రోతువంచెల్లెడన్
గొనియాడం బడుచుందు విప్పగిది దిక్కున్ మ్రొక్కులున్లేని నఁ
గనుటే కష్టముదోఁచెనా పదికి మత్కర్మానుసారంబుగన్.

దోషమొదవిన దాన సంతుష్టిఁ గాంచఁ
గండకండలుగాఁ గోఁతు కానిదేవ!
పాపభాండంబు నాతలఁ బగులనడచి
పాడులోకాన నిందలఁ బఱుపవలదు."

హృదయతటంబు వ్రీల్లి వెలికెంతయుఁ గ్రోధరసంబు పాఱుచు
న్నదియన ఘర్మతోయము గనంబడ దేహమునందు నెల్లెడన్
బదముల తొట్రుపాటొదువవచ్చు తనూజునిఁగాంచి నంతనే
యదరునఁ గోసలాసతియు 'హా!' యని త్రెళ్ళెధరాతలంబునన్.

"అతివాత్సల్య సుధారసార్ద్రములఁ బుణ్య శ్రీ కటాక్షంబులన్
పతతంబున్ గరుణించు మజ్జనని 'వత్సా!' యంచు నన్బిల్వ దీ
గతి ధాత్రింబడి మూర్ఛనొందె విభునిన్ గారాగృహంబందు నుం
చితినంచున్ ననుఁ దిట్టఁబోదుగద! రాశీభూత రోషాగ్నియై,"

# నిరాకరణము

అని యిట్లజాతశత్రువు
తన మనమున నెంచుచుండ దైన్యముతోడన్
గనువిచ్చి కోసలాసతి
తనయునిగని నిశ్వసించి తలఁకెడు మదితోన్.

"ఇంచుకయేని పాపమనియెంచక తండ్రిని బట్టి బంది వే
యించఁగ నెట్లు బుద్ధి జనియించెనురా? నిను నింతవానిఁగా
వించుట దీనికేనటర? విశ్వజనీన భవత్కులోన్నతిం
గాంచక యీ కుమార్గమునఁ గాల్నిలుపం దలకొంటివేలరా?

చల్లఁగ నీవు వర్ధిల నజస్రము భక్తిరసాత్మ నూరుదే
వుళ్ళకు మ్రొక్కు నీజనకుఁ బూజ్యుని దారుణ పాపబుద్ధితోఁ
దల్లడమంద బందిని వృథాశ్రమపెట్టు కృతఘ్ను, నిన్ జగం
బెల్లను 'ద్రోహివీఁడ'నుచు నెంచి త్యజించదె పాపకర్ముఁడా!

నీతండ్రి క్రూరుఁడేవో
ఆతనియెడ నిట్టి యవినయము నీ కగునే?
పాతకుఁడ వయ్యెదే? పితృ
ఘాతుకుఁ డనిపించుకొనెదె కర్కశబుద్ధీ!

# ధర్మ దీక్ష

నీపూర్వు లెవ్వరైనను
నీ పగిదిని జనకుఁబట్టి హింసించిరె ? ఛీ
మీపతుల ధర్మమిట్టిదె ?
పాపాత్మా ! కులము నిందపాల్సేయకుమా ?

కూడు నీరునులేని కక్కుఱితిచావు
నకు దొరకఁ గుటిసేయు దుర్ణయుఁడవైతి
మీఁద హత్యాపదగ్దుఁడవౌదు" వనెడు
జనని పల్కుల నాతఁడు సరకుఁగొనక.

"ఇంతటి వెఱ్ఱిదానవయితేమిటికో ననుఁగన్నతల్లి దు
ర్ధాంత దురంత పాపసముదాయ గృహాయిత మానసుఁడయా
స్వాంతముతోడఁ గావుమనిపల్కెదు; ధాత్రి తదంగరక్తవే
శంతముఁగా నసింగసిమసంగిన నించుక పాపమున్నదే ?

ఏదోషంబునకై నినుం గినుకతో నీరీతిగాఁ జంపఁగా
నా దుష్టాత్ముఁడు పూనినాడు? జననీ! ఆవంతఁ దెల్పంగదే?
వాదాడం బనిలేదు వానిఁ గరుణింపంగరాదు హంతవ్యునిఁ
శేదొక్కింతయుఁ దావు నీమనసుఁ జెల్లింపంగ ధర్మస్మృతిన్.

## ని రా క ర ణ ము.

ఇల్లు గాల్పించు చెడుగు నాయింగలమున
నట్టెత్రోయించుటే ధర్మమయ్యె—నట్లు
సేయకుంచితిఁ జెఱను సజీవుఁగాఁగ;
ఎటులనైతిఁ బితృద్రోహి నేను తల్లి!

జననినైన జనకునైన సఖునినైనఁ
గరుణఁ జూడదు దోషంబు గలిగెనేని
ఆర్య శిక్షాస్మృతి; తదీయవిధివి
ధానమంతయుఁ గుడువక తప్పుటెట్లు?

# అ భి శో చ న ము



భయద కల్లోలాబ్ధిఁబడి దిక్కుమాలి వే
సారెడు రాజహంసంబురీతి
ఆఁకలి దప్పులకడలి బోనునఁ దూలి
యారాట పడెడు సింహంబుకరణి
విసముఁగ్రక్కింప దూపిలిపేటికంజిక్కి
బుసలపెల్లునస్రుక్కు భోగిమాడ్కి
ఉరవడి యున్నటులుండి యోదంబునఁ
గూలికుందెడు మత్త కుంభిపోల్కి

కాలుమందిరమునకు ప్రక్కగది యనఁగఁ
జాలు చెఱఁబడి యుప్పెన లీలఁగనుల
వెడలు నశ్రులఁ జేతులఁ దుడుచుకొనుచు
బింబిసారుఁడు హృదయంబు ప్రిదులఁబల్కు.

"మానమ! నీవుమాత్రమును మాఱట రక్కసు నన్నుఁబాసినన్
బ్రాణము లెంతమాత్రమును బాయక కాఱియపెట్టుఁబాప లో
కాన నొకింత శాంతియును గల్గినఁగల్గఁగ వచ్చుఁగాని నా
కేనియతిన్ బ్రశాంతి లభియించును మృత్యువుమూల్గు నీ చెఱన్.

# ధర్మ దీక్ష

అనత మహామహీపతులనందఱ నిర్జితులం బొనర్చి యెం
దును సరిలేని కీర్తి రమతోఁ దులఁదూఁగుచుఁ జీఁకు చింతలం
గనక సుఖించు నన్కొడకుఁ గన్నసుతుండు విధించినట్టి శి
క్ష ననుభవింపఁజేసెడిని - కాలదుఃంత విపర్యయంబయో!

ఎండిన భూజము౯ విడచి యేగెడు పక్షులరీతి నన్ను నొ
క్కండును గూడఁ బాపమని కానఁగరాడు సమస్తధారుణీ
మండల సార్వభౌమపదమాన్యుఁడనయ్యును బందిఖానలోఁ
దిండియు నీరెఱుంగని గతి౯ గృశియించి నశింపనయ్యెనే!

నేను క్షుధాగ్నిచేఁగుములి నిల్వున నీఱయిపోయిన౯ 'దయా
హీనుఁడు సెల్లె - భూమిధరమెల్లయు వాసె' నటంచు నుబ్బనే
గాని - కవోష్ణబాష్పములు కన్నులనించునె? యెట్టి సత్కృపా
మానసుఁడైన మర్త్యుఁడును మానక నన్నెదలోఁ దలంచుచోన్.

కన్నులఁగ్రమ్ము రాజ్యమదగాఢతమంబున విఱ్ఱవీఁగు చే
నన్నిట మన్నుమిన్నునక - ఐహిక భోగ మరీచికాశికైఁ
బెన్నిధిఁగన్న పేదగతిపేరెము వాఱితిఁగాని యెన్నఁడు౯
బున్నెఁపు బాటయందుఁ దలపోయఁగఁ గాలిడనైతి నక్కటా!

## అ భి శో చ న ము

భానుతాపంబును భరియించి చల్లని
నీడలిచ్చెడు ధారుణీజమువలె

సానఁబట్టుటఁజేసి సాబాలు దఱిగియు
ధగధగ మెఱయు రత్నంబురీతి

నాగంటి చీల్పుల నలఁగి నొచ్చియు సస్య
పులకితగాత్రయౌ భూమిమాడ్కి

కట్ల కొట్లంబడి గాసిల్లియును మేలి
దుగ్ధంబు గురియు గోముగ్ధపగిది

ఏనుబెట్టెడు కష్టంబులెల్ల నోర్చి
అతులమోదాబ్ధి నన్ను నోలార్చు సతిని
జంపఁదలఁచిన పాపనిశ్చయుఁడ నాకు
బంధనవిముక్తి గలదె యీభవమునందు.

అక్కటా! నోటికందిన యమృతపాత్రఁ
జేతులారఁగ మన్ను పాల్సేసికొనిన
మందభాగ్యుఁడ నిద్ధరామండలమునఁ
బొడముట దురంత దుఃఖాగ్నిఁ బొగులనేమొ!

# ధర్మదీక్ష

బైసిమాలిన పరమనిర్భాగ్యు నన్ను
నీవుగాకున్న నెవరు మన్నింపఁగలరు ?
అంజలి ఘటించితిని తావకాంఘ్రులకును
దప్పుసైఁచితి ననుమ యుదారచరిత !

ఏ జన్మంబునదౌ తపఃఫలమొకో ? యీజన్మమందిట్టి ని
ర్వ్యాజప్రేమరసస్వరూపవగు నీవర్ధాంగివై భక్తి నన్
బూజింపన్ నినుఁజంపఁ జూచిన మహామూఢుండ భూభారమై
హా ! జన్మించితి మానవాకృతిని ; మ్రానై పుట్ట కెచ్చోటనో !

ఇంతటిపాపకృత్యమున కెట్లుతెగించె దురాత్ముఁడంచు న
న్నెంతగ దూరుకొంటివో ? మఱెంతగ నెమ్మదిఁగ్రుళ్ళిపోతివో
కాంత ! భవత్పదాంబుజయుగంబు పయింబడి వేడుకొంట కొ
క్కింతొ యనుజ్ఞయైనఁ గలదే ? నినుఁగాంచెడు భాగ్యమున్నదే ?

'అనపరాధకు ప్రాణదండన విధించు
పాతకుఁడు కృపాభిక్షకపాత్రుఁ డనుచుఁ
బలుకు చున్నావటే చెలీ ! బ్రతుకలేను
నీవు దయతోడ నన్ను మన్నింపకున్న.

# అ భి శో చ న ము

లలనారత్నమ! యీ కృతఘ్నుసరు నిర్లక్ష్యంబుఁ గావింప కె
ట్టులు ప్రేమించితో? యోరిమిందలఁప నీడుంజోడు నీకెవ్వరీ
యిలలో; నాబెడిదంపు చెయ్దమెదలో నెట్లెట్లొ సైరించి నన్
గలనైనన్ దలపోయకే గడుపు మీ కాలావశేషంబిఁకన్.

ఏ పాపంబెఱుఁగని నీ
కీపగిది నొనర్చినట్టి యెగ్గునకుమదిన్
దాపంబందెద నిరతము
నాపాటును గుఱిఁచి యంతనవయలతాంగి!"

పరిపరి నిటుఁబనవుచు మదిఁ
బొరలి పొరలి వచ్చు దుఃఖమున గాసిలుచున్
ధరణిపతి వలఁ దవుల్కొని
యురియాడు ఖగంబుపోల్కి నూర్పులు నించున్.

# అ ను తా ప ము



లలిఁబూనీఁట మునింగి పుష్పొడి దుకూలంబున్ మొలందాల్చి కే
వలవాఃపూర్ణసరోవరంబుల నొగిన్ బద్మాసనస్థంబులై
యశియోగివ్రజముల్ త్రయీమయతనుండౌ పద్మినీకాంతు న
స్ఖలితామోదరసాప్తికై కొలిచె ఝుంకారోంకృతిన్ వేకువన్.

పసిపాపండగు దర్శకున్ నిజమనఃప్రస్యందివాత్సల్య పూ
ర్ణసుధాధారలఁదేల్చు చూరువులపైనన్ నిల్పి ముద్దాడు సం
తస మారంగ నజాతశత్రుఁ; డటఁ జెంతన్ భార్య పద్మావతీ
బిస బాహామణి; తల్లికోసలయు సంప్రీతాత్మలై చూడఁగన్.

మురిపెములు మూటఁగట్టెడు ముద్దుకొడుకు
తొడలపై మూత్రధారల విడచినంత
కనుఁగవను నవ్వు దొలుకాడ కన్నతల్లి
తోడ నపు డయ్యజాత శత్రుఁడు వచించు.

“జననీ! బిడ్డను నావలెన్ బరమ వాత్సల్యంబు దీపింపఁ జూ
చునె యే తండ్రియు వాని బిడ్డ?” నని తాఁజోద్యంబుగాఁబల్కినన్
విని - కన్గోనలనుండి జాలుగొను కన్నీటిన్ దుకూలాంచలం
బున నింకించుచు నాసతీమణి మనస్స్ఫోటంబుగా నిట్లనున్.

# ధ ర్మ దీ క్ష

ఏవే ప్రాణవిరోధివై దువనియుఙా నీ తండ్రికం చెందతో
దైవజ్ఞుల్ వచియించినం గలఁతఁ జెందంబోక సమ్యక్కృపా
భావంబొప్ప 'నజాత శత్రుఁడ'గు నాబాలుండటం చెంతయుఙా
దావిశ్వాసముతోడఁ గోర్కెలివురొత్తం బెంచెనిన్నింతగా.

అతనికి నీవు మారకుఁడ వయ్యెదవేమొ యటన్నభీతిచే
ధృతిపెడి విన్నశోకవని నే విడనాడుచుటింగి 'యక్కటా!
మతువిటు పేయఁగాఁదగునె? జోస్యులమాటల నమ్మి'యంచు, నీ
పితవెత తద్వనంబునకు వేగమ తాఁజని నిన్నుఁదెచ్చియున్.

"పోముపలెనున్న వీని నశోకవృక్ష
వాటికను వీడ మనసెట్టు వచ్చె' ననుచు
వాఁ డశోకచంద్రుం డను నామ మిడియెఁ
బరమ కారుణ్యరస సమాదరణ నీకు.

కఱచెమును పిచ్చికుక్క నీకాలివ్రేలు
జనులు గుమిఁగూడి వింతగాఁ గనుచునుండఁ
జీఁకె విషరక్త పూరముల్ జిందువ్రేలి;
బాధ తగ్గుటకై నీదు పరమగురుఁడు.

# అ ను తా ప ము

ప్రాణదానమిచ్చి పరమ దయాదృష్టి
మనుచు జనకు బందినునిచి నీదు
కొడుకు బుజ్జగించుకొనుట గొప్పగనెంచి
వదలెద”నుచు నామె పలుకునంత.

కనులంగాల్వలుగట్ట నశ్రువులు; మైకంపింప; దెందంబునన్
బెనుమంటల్ చెలరేఁగినట్లయిన తాల్మిందూలి డగ్గుత్తుకన్
“జననీ! పాపములెల్లఁ జుట్టుకొని నన్ ధర్మచ్యుతుంజేసి-తి
రని దుఃఖాంబుధిముంచె, నెద్దిపలుకన్ రాదమ్మ నానాల్కకున్.

పతితుఁడనైతి నాచిరతపః ఫలమైనయనుంగుఁ దండ్రి, దు
ష్కృతమతి బందినుంచితి నశేషజనంబు లెఱుంగ; మాతృదే
వతనిను గోడువెట్టితి నభాగ్యుఁడనైతిఁ; బునీతమైన యీ
క్షితితలమెల్ల నాతనికిఁ జెచ్చెఱనిచ్చెద దోయిలించుచున్.

పరితాపాశ్రు మహోద్ధత
తరంగిణిన్ మున్గిపోయి ధర్మాత్ముండౌ
గురుని చరణఘట్టంబున
నరుడుగఁ దేలియునుదెత్తు నాతనిఁ దల్లీ!

ధ ర్మ దీ క్ష

ఈగదంగొని నేనేగి యీక్షణమున
బంధనద్వార కవాటముల్ పగులఁగొట్టి
యీవుకనుఁగొనఁ దండ్రిని నిటకుఁదెచ్చి
కన్నతల్లిరో! పట్టంబు గట్టువాఁడ."

పతినిర్బంధము వాయుననన్న దృఢ విశ్వాసంబు చిత్తంబునన్
ధృతినెక్కొల్పఁగ విశ్వమున్ మఱచి యట్లే తల్లి నిల్వంగ - సం
తత కారుణ్యకటాక్షముల్ వఱపఁ దత్కాంతావతంసం; బతం
డతివేగంబునలేచి పర్విడియెఁ గారాగారముం జేరఁగన్.

కరముద్రేకముతో గదంగొని మహాగాంభీర్యమొప్పార - స
త్వరమేతెంచెడు దుర్నిరీక్ష్యసుతు, భూపాలుండు దాదాపునన్
పెరలన్ గన్నులు జేవురిల్లఁ గనుచున్ జింతించె - దుర్దాంతదు
ర్భరదుఃఖానలకీలకా నికరతప్తస్వాంతనీరేజుఁడై.

"నేనిట నిన్నినాళ్ల మరణింపని యున్కికి వాని కెద్దియో
మానసమందు శంకవొడమన్ గద నాతల మొత్తిచంపఁగాఁ
దానిటులేగు దెంచుటయ తథ్యము; కన్నని సుంగు మిత్తియై
ప్రాణములంగొనంగ విధివ్రాసె ముఖంబున మూఁడు పంక్తులన్.

# అ ను తా ప ము

పరదురాసద బాహు బలవిక్రమంబున
జగము నల్గడల యశంబునొంది

సకల సామ న్త రాజన్య సందోహంబు
మనసారఁ జేయు సేవనుగడించి

మగధసామ్రాజ్య సీమలనెల్ల జయరమా
రంగస్థలులుగాఁగ రహినొనర్చి

శాంతపావన ధర్మచక్రము చేఁ జేతఁ
బట్టి సర్వంసహాప్రభుత నెఱపి

కడకుఁ జెఱసాలఁబడి యిట్లు క స్తిపడుచుఁ
బౌరుషము సెడి ప్రాణముల్ వదలలేని
మానహీనుని నను జంప సూనునిటులఁ
బనిచితే విధీ! వసుమతీ భరము దీర్ప.

కొడుకునకుఁగాక తక్కు లోకులకుఁగాక
యేమనుభవింప జీవింతు నీధరిత్రి
నాదు చితివహ్నిలో శిశునాగవంశ
కనక మతి శుద్ధమై భువిఁ గ్రాలఁగలదు.

# ధర్మదీక్ష

వెక్కసమైన నాహృదయవేదన యెల్ల శమించిపోవు నిం
కొక్కక్షణంబు లోపల నహో! సుఖినౌదునుగాని కోసలా!
నిక్కము నిక్క మిట్టి ధరణీతల నాథునిమీఁది యాసతో
దిక్కఱినట్టి పక్షివయితే విధియెంతటి క్రూరుఁడోగదా!

ఓ పరంజ్యోతి! విశ్వభర్తా! పరేశ!
మత్కృత దురంత పాపకర్మముల నైఁచి
నరుగఁ బుట్టింతువేని విన్నపముఁ గొనుమ
కోసలాసతిఁ బత్నిగాఁ గూర్పవలయు.

మాదు శిశునాగ కులకీర్తి మంటఁగలియఁ
దనయుచేనైనఁ జావఁగాఁదగునె?" యనుచుఁ
దనకడంగల విషమునుద్రావి నృపుఁడు
అసువులఁ దొఱంగి యట్టులెయవనిఁ గూలె.

చెఱవిడిపించి తండ్రిఁగొని చెచ్చెఱ నేగుదమన్న కాంక్షక్రే
ళ్ళుఱుకఁగవచ్చి నేలఁబడియున్న ధరావిభుఁ జూచినంత వాఁ
డఱిమిఱి రిచ్చపాటును భయంబును ముప్పిరిగాగ యెట్లొ - ద
గ్గఱి కని 'హా! యనుంగుజనకా!'యని కూలె నిరుద్ధకంఠుఁడై.

# అ ను తా ప ము

పిడుగడచినట్లు నేలం
బడి కొండొక వడికిలేచి బాష్పాంబువులం
దుడుచుకొను చెలుఁగు కుత్తుకఁ
దడఁబడ శోకాగ్ని హృదయధామముఁగాల్పన్.

పసిఁడి కందని చాయ - యిభంబు మలఁచు
దేహ బలమెల్ల నెందు గతించెనయ్య?
అన్నపానీయములు లేక యటమటించి
శల్య చర్మంబులను వీడి చనితె తండ్రి !

కుటిలుఁడ ఘోరకల్మష విఘూర్ణ మలీమస మానసుండ నే
నిట కరుడెంచుటంగని సహింపక ప్రాణములం ద్యజించితే
కటికి విసంపు ద్రావకము గ్రక్కునఁ గ్రోలియనుంగుఁ దండ్రి ! వి
న్కటకట ! పాడు కన్నులను గాంతునటయ్య యిఁ కెన్నఁడేనియున్.

దోసిలియొగ్గి నీదుపదతోయరుహంబుల వేఁడుచుంటి, వి
శ్వాసము నాపయింబొడమ - వర్జిత గర్వముతోడ; నింక నా
చేసిన దోసముల్ సయిఁచి చిత్తమునం బురిగొన్న పాప సం
త్రాసము నెల్ల మాన్పి కరుణారసదృష్టిని బ్రోవవా ప్రభూ !

# ధ ర్మ దీ క్ష

తడయక ప్రాణ దైవతముఁ దప్పక బంధవిముక్తుఁ జేసి పు
త్రుఁడు గొనివచ్చు నిప్పుడని ప్రోఁడయి యున్న మనంబు మొగ్గలం
దొడుగఁ బ్రతీక్ష సల్పెడు ననుం గడుపారఁగఁ గన్న తల్లికే
వడువున వింతు నియ్యశనిపాత భయంకరవార్త భూపతీ!

సమ్మదాశ్రులఁ ద్వత్పదాబ్జములఁ దడుప
గాఢ విశ్వాసమున వియోగంబు నోర్చి
బ్రతికియున్న నా తల్లి యీ వార్త విన్న
గుండె వ్రీలఁగ మరణింప కుండునయ్య!

వను దయఁబెంచి పెద్దగనొనర్చిన కూరిమి తండ్రివైన నిఁ
ఘనతర పుణ్యమూర్తిని నకల్మష చిత్తునిఁ జంపుకొన్న యీ
చెనటి కళేబరంబును నిసీ! తుదకుం గనులారఁ గాంచునే
జనకముతైన; నింకొరులు చూడఁగలారను మాట చెల్లునే?

జనకవాక్పాలనం బొనరింప వనులకుఁ
జనిన రాముని గన్న ఘనచరిత్ర
పిత్రాజ్ఞమై జనయిత్రి ఖండించిన
పరశురాముని గన్న పరమధీర

# అ ను తా ప ము

తండ్రికోరికఁ దీర్పఁ దాఁ బెండ్లి మానిన
దేవవ్రతుని గన్న పావనాత్మ
తనయౌవనంబును తండ్రికర్పించిన
పూరునిఁగన్న భూభువనవంద్య

భరతధాత్రీమ తల్లి; తత్పరమరత్న
గర్భమునఁ బుట్టి కటకటా ! కన్న తండ్రి
ప్రాణములు గొన్న నా వంటి పాతకునకు
నిహపరవిదూరునకు నింక నేటి బ్రదుకు ?

తండ్రి యసువులఁగొన్న పాతకి యటంచు
నన్ను విషకీటకంబును గన్నరీతి
జగము నీచముగాఁ జూడ నెగులు దక్క
అయయొ ! యెటులుందు మొండికట్టియ విధాన.

మ్రాఁకునం బుప్పి పుట్టిన మాడ్కి గాధ
కలి కలుషమెల్ల నా యందుఁ గలసిపోయి
కూలఁ ద్రోసెను దుఃఖాగ్నికుండమందు
నాయనా ! లేచి ప్రోవవా యీ యభాగ్య.

# ధర్మదీక్ష

ఈ విధిదేహముఁ విడిచి యేగిన నీకయి గోడు సెందనా ?
చావఁగ సిద్ధమా జనని చావునకై మదిఁ గ్రుంగి పోదునా ?
యీ వసుధాస్థలిఁ జనములెల్లను దూరఁగ నెగ్గు సిగ్గులం
బో విడనాడి కాలమును బుచ్చుదునా ? యొక లేకిపోలికన్.

శాంతిని జెందునే పటు విషాదకఠోర దవాగ్ని దగ్ధ హృ
త్స్వంతత తాప ; మీ పయిఁ బ్రసన్నములయ్యెడునే దినంబులం
చెంతయు నెగ్గు రాలుపడనేడ్చె నతండు ; తదీయమా శిలా
స్వాంతమెటుల్ ద్రవించెనొ ? యసాధ్యము తెల్పఁగ నెంతవారికిన్.

తలనుద్రుంప జీవము పోక తన్నుకొనెడు
మొండెము విధాన నేలపైఁ బొరలి పొరలి
యశ్రుజల కశ్మలంబైన యక్షియుగము
మొగిడిచి యెడందలో బిట్టుఁ బొగులు నతఁడు.

# శాంతి సందేశము



చదలేటి కెరటాల చాలునఁ బొదిఁగొని
తేలియాడెడు హంస జాలమనఁగ
సొబగారు రేచాన కబరీ భరంబునఁ
జెరివిన జాది క్రొవ్విరు లనంగ
జిలుఁగు మబ్బుల నీలి చీరపయిన్ మేల్క
డాని మించు జరీబుటా లనంగ
కాలమణీ వణిగ్గగనా పణంబునఁ
దళ తళలాడు ముత్యంబు లనఁగ

సకలజీవనయన చాతక పంక్తికి
శీతలాంబు బిందుపాత మనఁగ
మినుకు మినుకు మనుచు మింటరెక్కొని పొల్చె.
ఒడలు పులకరింప నుడుగణంబు.

రాజ గృహపురి కనతి దూరంబునందు
శాంతిదేవత నాట్యంబు సలుపునట్టి
వేణు వనమును భిక్షుక వితతి తోడఁ
బావన మొనర్చె బుద్ధుఁడు భద్రమూర్తి.

# ధర్మదీక్ష

భంగ భంగములం బొంగి ప్రత్యహంబు
ధైర్య కూలంబుఁ గోయు నుత్కటవిషాద
నదిఁ దరింపఁగఁ జేయునం చెదఁ దలంచి
చనె నజాత శత్రుఁడు బోధిసత్త్వకడకు.

కటికి రాగుండియగల కసాయికి నైన
జాలిఁ బుట్టించు ప్రసన్నరేఖ
సంసరణక్లేశ జలరాశి మున్గిన
జీవులనెల్ల రక్షించు కరుణ
తన ప్రాణములు గొనఁ దలఁచు కర్కశునైనఁ
బరుసంబు లాడని పరమశాంతి
కలి కల్మషౌఘాంధకార నిర్మూలన
చణమైన బ్రహ్మతేజంబు దంబు

వదన పద్మంబునం దుట్టి పడుచునుండఁ
బరమ బోధామృతము శిష్య పంక్తికెలమిఁ
బంచు జగదేకగురు భగవాను పదము
లంటుచు నజాతశత్రుఁ డత్యంత భక్తి

# శాంతి సందేశము

"ముక్కాలి ముదుకఁడై స్రుక్కు తండ్రిని దుర్వ్య
ధా రాజధాని వాస్తవ్య సలిపి
జగదేకసాధ్వి మా జనని యశోధరా
దేవి వియోగ విధేయసేసి

ధారుణీ పాలన తాత్పర్యమను పరా
ధీనవృత్తికి స్వస్తిఁ దేట పఱచి
కంటకావృత భయంకర కాననంబుల
దేహ మెండఁగఁ దపో దీక్ష నెఱపి

సంసృతి విషణ్ణ మానవ సమితిఁ బ్రోచు
శాక్యముని! బుద్ధగురుదేవ! సకల కలుష
దావ పావక కీలికా దగ్ధ హృదయు
నన్నుఁ గరుణింపవే నిన్ను నమ్మినాఁడ.

కరుణా దుగ్ధపయోధి! త్వత్పద దళత్కంజాత యుగ్మంబు - ఆ
మరణంబుల్ మఱువంగఁ జాల; నను దుర్మార్గుల్ దయాహీను, దు
స్తర పాపాబ్ధిఁ దరింపఁజేసి దరిజేర్చన్ నావయెవ్వారు? మా
గురుపాదుండవు నీవు దక్క; మునిరాట్కోటీర భాస్వత్పదా!

# ధ ర్మ దీ క్ష

దుర్మార్గుఁ గుణహీనుఁ గుత్సితమతిఁ దుష్టాత్ముని ఘోరదు
ష్కర్ముఁ నన్ను గులాముఁ జేసికొని వీఁకఁ సర్వపాపౌఘముల్
ధర్మాత్ముఁ నయశీలునిఁ జనకునిఁ దాక్షిణ్య వారాన్నిధిఁ
నిర్మూలింపఁగఁ జేసె జీవకరుణా నిర్నిద్ర ! యింకేమనన్.

నన్నుఁ గన్నతల్లినా పాలి కల్ప వ
ల్లీమతల్లి పుణ్య లీలఁజెల్లి
ఒక్క యంగలోనఁ జిక్కించుకొని ప్రాణ
పతి నలంకరించె పరమపదము.

నా కిఁక నరకంబే గతి
ఘాకంపమురీతిఁ బూర్వ పుణ్యమునెల్లఁ
బోకార్చెను పితృఘాతుక
భీకర దుష్కృత్య మిటుల ; విశ్వజనీనా !

మమతలఁ బాఱఁద్రోలితివి ; మారుని మాయలఁ గెల్చి నిత్య సౌ
ఖ్యము ఘటియించు మోక్షపదమందితి ; సంసరణాంబు రాశిలో
న మునుఁగు జీవరాసుల కనారత భద్ర పథమ్ము జాటు, నిఁ
విమలచరిత్ర ! గౌతమమునీ ! అలతిఁ గొనియాడ నేర్తునే !

# శాంతి సందేశము

భవ భయ వారకంబులు భవత్కృతబోధము లాలకించుచుం
దవిలి త్వదీయ పాదములదండ సుఖించుచు మిన్నుముట్టు త్వత్
ప్రవిమల శిష్యకోటి పదపాంసు లవంబున కే విధంబుగం
భువన తలప్రశస్త ! సరిపోలుదు ద్రోహిని కశ్మలాత్ముఁడన్.

అంబుధిఁ బోలు నీదు హృదయం బనవద్యము ; త్వత్ప్రపూత భా
వంబులు పుణ్య దృష్టియును వారిద పంక్తి నతిక్రమించి, అ
య్యంబరమంటు, దోష రహితాత్మక ! నన్నుఁ బునీతుఁజేసి ప్రే
మంబున నేలుకోగదవె ? మామక దోషములెల్ల సైఁపవే !

పరమోదార గుణాకరా ! నయన నిర్వాణంబు గావించు సు
స్థిర సౌఖ్యామృతమూర్తి నిన్విడచి యక్షీణవ్యథాగాధ సం
సరణాంభోనిధి నెట్లుఁ దోఁగెదను నన్మన్నింపవే" యంచుఁ ద
చ్చరణ ద్వంద్వము రా సుతుండు గడిగెం జాల్గొన్న కన్నీటిచేన్.

" కలఁగకు మన్న డెందమునఁ గాలసముద్రము నెంతవారికిం
దలమె తరింపఁగా ? పరమదారుణ పాపతమశ్చయంబు, ని
న్నలమఁగ నట్టులయ్యెను భయంబును మానుము ; నిర్వికల్పమై
యలరెడు ధర్మతేజము త్వదంధత మాన్పి సుఖంబు నిచ్చుతన్.

# ధర్మదీక్ష

కడలి గర్భంబునన్ మాటు వడినయట్టి
మౌక్తికంబులవంటి సన్మాన్య చరితు
లెందరీ ధారుణీస్థలియం దడగిరో ?
చంచలంబైన జగతి శాశ్వత మెదోయి !

క్షణమున నశించు భౌతిక సర్వభోగ
భాగ్య శంపాలతకు కలవర మదేల ?
ప్రణయ రసముగ్ధఁజేయు నీ పత్నియైన
ననుసరింపదు నిన్నుఁ బ్రాణాత్య యమున.

జలధి మేఖలయను మహా సత్రశాలఁ
దగిలి విడసిన మానవాధ్వగచయంబు
నేఁడు గాకున్న రేపైన వీడవలయు
గాలిమేడల నింతలోఁ గట్టనేల ?

తీరని కామ్యతృష్ణ జగతిం గల జీవుల పచ్చి నెత్తురుల్
వారక గ్రోలుచున్ గలుష వాగురలంబడి మృత్యుదేవతా
దారుణ దంష్ట్రికా క్రకచదర్శన మౌనపు డౌర ! దుర్జనుల్
ధీరతఁబాసి వాచఱచి దిగ్భ్రమఁజెంద ఫలంబు గల్గునే ?

# శాంతి సందేశము

బలిమి దుర్గంబు సాధించువానికంటె
మనసు స్వాధీనమందుంచుకొనెడు వాఁడు
ఘనుఁడు గావున ధర్మమార్గంబునందు
దుడుకు మనసును శాంతితో నడుపుమన్న.

అలఘుదయా సత్యంబుల
వలనన్ దోషమున కొదవుఁ బ్రాయశ్చిత్తం
బలసియు సొలసియు నెమ్మదిఁ
గలఁగఁగ నే లన్న శాంతిఁ గాంచుము బుద్ధిన్.

పరితాపం బెవఁ డొందుఁ జేసిన మహా పాపంబు గుర్తించి; ఆ
నరుఁడింకన్ దన జీవితంబునను స్వప్నంబందునన్ పాపపుం
దెరువుం ద్రొక్కక ధర్మమూర్తియగు ; శాంతిం బొందుఁగాతన్ త్వదం
తర దుఃఖానల తాపమంతయు ; ననంతప్రీతి సంధిల్లుతన్. ”

పరమ నిర్వాణ పద పట్టభద్రుఁడైన
బుద్ధముని చంద్రుఁ గీర్తించు పొలుపుఁదోఁప
మందమారుత లాలనామందమధుర
వేణునాదోక్తి వనలక్ష్మి వెల్లివిరిసె.

# ధ ర్మ దీ క్ష

గగనవాణి మహాప్రేమ గౌరవమున
సేసముత్యాల జల్లు వర్షించినట్లు
పలపలఁగ రాలె హిమబిందు పటలియపుడు
సిద్ధ సంకల్పుఁడగు బుద్ధు శిరముపైన.